శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.



# ప్రత్యక్ష రామచంద్ర శతకము

సీ॥ శ్రీకాంతహృత్సర ♦ సీరుహభాస్కర
భక్తాఘమందార ♦ భవవిదూర
పురుహూతసంస్తోత్ర ♦ భువనత్రయపవిత్ర
జలజాప్త శశినేత్ర ♦ సచ్చరిత్ర
నగధీరరిపుభంగ ♦ నతజన సత్సంగ
కరుణాంబుధితరంగ ♦ ఖగతురంగ
కౌస్తుభశ్రీవక్ష ♦ కరమర్థిగజమోక్ష
వేదవేద్యాధ్యక్ష ♦ విబుధరక్ష

తే॥ గీ॥ శంకచక్రగదాహస్త ♦ సత్ప్రశస్త
కామితార్థసుధీజన ♦ కల్పభూజ
భక్తవత్సలభాసుర ♦ భద్రశైల
ధామ కృపాసాంద్ర ప్రత్యక్ష ♦ రామచంద్ర.

సీ॥ అవధరింపు దశర ♦ థాత్మజ నీమీఁద
సీసశతకము ర ♦ చింతు నేను
ఆంధ్రసంస్కృత నిఘం ♦ టాద్వికావ్యము లైనఁ
జదివియెఱుంగని ♦ జడుఁడగాన
ఛందస్సులందున ♦ సత్క్రగణయతి
ప్రాసలక్షణశబ్ద ♦ దోషములను
లేశమాత్రంబైన ♦ దేశికునివలన
మొదలె నేరనియట్టి ♦ మూఢమతిని

తే॥ గీ॥ బహువిధంబుల మఱువక ♦ భక్తిచేత
సంతసంబున నీనామ ♦ స్మరణజేతు ॥ భ ॥ 2

సీ॥ ఆదినారాయణా ♦ పాథోధిశయన నా
నేర మెంచకుమయ్య ♦ నిర్మలాత్మ
తప్పులో ప్పులోగాని ♦ తావకసత్కృపన్
నోటవచ్చినరీతి ♦ నుడువుచుంటి
ప్రజ్ఞనాయదిగాదు ♦ భారంబు నీయదె
పోలఁబొందశతకంబు ♦ పూర్తిజేయ
వనజాక్షయిక్షువు ♦ వంకరయ్యెయున్న
మాధుర్యమెటుబోవు ♦ మహితచరిత

తే॥ గీ॥ పంకమందునఁ గమలముల్ ♦ ప్రబలునటుల
లోకమిందున్న సద్భక్తి ♦ లోటుపడునె ॥ భ ॥ 3

# ప్రత్యక్ష రామచంద్ర శతకము.

సీ॥ ఇందిరాహ్లాదయేశ ♦ బృందారకులు మునుల్
గంధర్వులును యక్ష ♦ బృందముపుడు
పంక్తికంఠుఁడు బెట్టు ♦ బాధలకును తాళ
జాలక వైకుంఠ ♦ సదనమునకుఁ
జనుదెంచి కావవే ♦ వనజాక్ష యని ప్రొక్క
వినుతిసేయఁగమది ♦ నెనరుగల్గి
యభయమిచ్చి బనిపి ♦ యంతట రూపొందించి
మానవాకృతిని భూ ♦ మండలమున

తే॥ గీ॥ తరణివంశజుఁడైన యా ♦ దశరథునకు
అగ్రసుతుఁడవై జన్మించి ♦ నట్టిదేవ ॥ భ ॥

సీ॥ చిఱుతనాఁడే మది ♦ వెఱువక గాధేయు
జన్నంబుగాపాడి ♦ సాహసమున
తాటకి మారీచ ♦ దైత్యసుబాహుల
దోర్బలంబునఁబోరి ♦ దునిమివైచి
పతిశాపకతమునఁ ♦ బ్రస్తరమైయున్న
సుదతిశాపమువాన్చి ♦ మిథిలకరిగి
ఖండేందుమౌళి కో ♦ దండంబు ఖండించి
క్ష్మాజనువరియించి ♦ నంతసించి

తే॥ గీ॥ పరశురాముని గర్వంబు ♦ భంగపరచి
వేగ సాకేతపురమున ♦ కేగినట్టి ॥ భ ॥

సీ॥ అనిశంబు సత్యవ్ర ♦ తాచారపరుఁడగు
తండ్రియాజ్ఞను పిన ♦ తల్లివలన
సౌమిత్రి వెనువెంట ♦ సద్భక్తితోరాఁగ
భూజాతతోసహా ♦ పురమువెడలి
చని విపినముఁజొచ్చి ♦ సరయూనదినిదాటి
గుహుఁ సన్మానించి ♦ కూర్మితోడ
భక్తితో శబరిచ్చు ♦ ఫలములఁభక్షించు
చును మెలంగుచునుండ ♦ జనకు మరణ

తే॥ గీ॥ మెఱిఁగి యుత్తరక్రియలను ♦ జరిపియచట
పర్ణశాలను వసియించు ♦ పరమపురుష॥ భ॥ 6

సీ॥ ఒప్పినసొగసుతోఁ ♦ జుప్పనాతి కపట
భావంబుతో వచ్చి ♦ భ్రమసివేఁడ
ముక్కుచెవులుఁగోసి ♦ మోసగించివనిపి
ఖరదూషణాది ర ♦ క్కసులఁజంపి
మాయలేడిని యొక్క ♦ సాయకంబునఁగొట్టి
ధరణిజఁ గోల్పోయి ♦ తల్లడిల్లి
గహనమంత వెదకి ♦ కానక సీతను
గొనిపోవు టెరిగించు ♦ ఘనజటాయు

తే॥ గీ॥ ముక్తినొందించి కిష్కింధ ♦ పురముఁజొచ్చు
రఘుకులాబ్ధిసుధాకర ♦ యఘవిదూర ॥ భ॥ 7

సీ॥ అంభోజదళనేత్ర ♦ యనఘసచ్చారిత్ర
మిత్రాత్మజునితోడ ♦ మైత్రిజేసి
బలవైరితుక్కునొక్క ♦ బాణంబుచేఁగూల్చి
పవనజుచే సీత ♦ వార్తనెఱిఁగి
వనచరస్తోమంబు ♦ నొనగూర్చుకొని యప్పు
సేతువుబంధించి ♦ శీఘ్రముగను
దశకంఠ ఘటకర్ణ ♦ దైతేయవ్రజముతో
సంగ్రామ మొనరించి ♦ సంహరించి

తే॥ గీ॥ వన్నెగావిభీషణునకుఁ బట్టముపుడు
గట్టినటువంటి మా జగ ♦ జ్జెట్టివౌర ॥ భ ॥ 8

సీ॥ కౌసల్యనందనా ♦ కపిసేనకొల్వఁగా
జానకీదోడ్కొని ♦ జయముమీఱగాను
విరిపుష్పకంబెక్కి ♦ వెడలి యయోధ్యకుఁ
జనుదెంచఁ నంత ♦ సంభ్రమమున
కమలసంభవరుద్ర ♦ సురమునిసతతి మెచ్చి
సుమవృష్టిఁగురిపింప ♦ శుభమటంచు
సంయమిభూదేవ ♦ సంఘంబులాశీర్వ
దించి మంత్రాక్షత ♦ లుంచగాను

తే॥ గీ॥ ప్రాకటంబుగఁ బట్టాభి ♦ షేకమంది
ఘనముగా రాజ్యమేలెడి ♦ ఘనుఁడవీవె ॥ భ ॥

సీ॥ శ్రీశంభునతినుతఁ ♦ సీతామనోహర
కారుణ్యరసపూర ♦ కామజనక
పతితపావననామ భక్తాఘహృద్ధామ
శోభాయమాన లో ♦ కాభిరామ
శ్రీరామనామంబు ♦ చెలఁగా నీ రేడు
లోకంబులనునిండెఁ ♦ బ్రాకటముగ
సృష్టికర్తగు వర ♦ మేష్ఠికైనను వేయి
శిరములుఁగల యాది ♦ శేషుకైన

తే॥ గీ॥ తావకమహిమోన్నతి నెన్నఁ ♦ గావశంబె
రావణాంతక దశరధ ♦ రాజతనయ ॥ భ ॥ 1(

సీ॥ క్రూరవర్తనుఁడైన ♦ ఘోరపాతకుఁడైన
జారుఁడైనను దురా ♦ చారుఁడైన
దివసాంతమునకొక్క ♦ తేప రామా యని
మనమున స్మరియించు ♦ మనుజనకును
రాకారమునునోట ♦ రాగానె దోషంబు
వారించుఁ దత్ప్రభా ♦ వంబువలన
మాకారమును నోట ♦ మఱి యుచ్చరింపంగ
వాటమైనట్టి క ♦ వాటమగుచు

తే॥ గీ॥ బాపమును జొచ్చనివదని ♦ ప్రకటితముగ
వేదములు బల్కుచున్నవి ♦ విదితముగాను॥ భ ॥ 1

సీ॥ కమలాప్రియ కళత్ర ♦ కమనీయ శుభగాత్ర
ఘోరదైత్యజిత వై ♦ కుంఠవాస
బ్రహ్మపిపీలికా ♦ పర్యంతమును భూరి
స్థావరాదుల చరా ♦ చరములందు
శోధింప నందింను ♦ సూదిమొనమోపగ
నెందుఁజూచినఁగాని ♦ సందులేక
సర్వంబు వ్యాపించి ♦ సాంద్రంబుగానిండి
భాసిల్లుచున్నట్టి ♦ పరమపురుష

తే॥ గీ॥ సచ్చిదానందరూపక ♦ స్వప్రకాశ
క్షీరసాగరశయన రా ♦ జీవనయన ॥ భ॥ 12

సీ॥ కైటభాంతక దేవ ♦ కమలాక్ష కేశవా
దినకరచంద్రాష్ట ♦ దిశలునీవె
భూనభంబులు సుర ♦ భూరుహంబులు నీవె
శైలంబులును మహా ♦ ఝరులునీవె
ఆదిశేషుండు స ♦ ప్తార్ణవంబులు నుడు
వ్యూహంబు నిఖిల జీ ♦ వులును నీవె
గహనంబులును మృగ ♦ ఖగనికరంబులు
నిగమముల్ పదునాల్గు ♦ జగములీవె

తే॥ గీ॥ పరగ లోకనిర్మితకర ♦ బ్రహ్మవీవె
ముఖ్యముగఁ బరికింపఁ ద్రి ♦ మూర్తులీవె ॥ భ॥ 13

సీ॥ కోసలాధీశ ముకుంద జనార్దన
రవికోటి సంకాశ ♦ రఘుకులేశ
పనస ఖర్జూరాది ♦ ఫలరసంబులకంటెఁ
బాచదారలకంటె ♦ మించినట్టి
రామనామామృత ♦ రసము నాజిహ్వకు
మంచిరుచిగ లభి ♦ యించెగాన
దురితంబు నేటితోఁ ♦ దొలఁగి ధన్యుఁడ నైతిఁ
బూర్వజన్మార్జిత ♦ పుణ్యమునను

తే॥ గీ॥ స్వప్నమున నైన మఱువక ♦ సంతతంబు
సంస్మరించెద నాజన్మ ♦ సఫలమునకు ॥ భ ॥ 14

సీ॥ కౌసల్య వరపుత్ర ♦ గర్వదానవజైత్ర
రఘుకులాంబుధిచంద్ర ♦ రామచంద్ర
దశరథుండనురాజు ♦ తనయుఁడనుచు నెంచె
హితుఁ డని సుగ్రీవుఁ డెదదలంచె
కడుబలాఢ్యుండని ♦ కపులు సేవించిరి
పురుషోత్తముఁడనుచు ♦ నెఱుఁగరైరి
క్షితినాధుఁడనుచు భూ ♦ పతులు గొల్చిరిగాని
జలజనాభుండని ♦ తలఁపరైరి

తే॥ గీ॥ గాన నినుఁదెలియు ఘనవరి ♦ కైవశమె
బ్రహ్మజనక పరాత్పర ♦ పద్మనాభ ॥ భ ॥ 15

సీ॥ రామ నీపాదాబ్జ ♦ రజమహత్వంబును
గౌతమబ్రహ్మర్షి ♦ కాంతయెఱుఁగు
భూసుతాధవతవ ♦ భుజబలమహిమను
చండికాలోలుని ♦ చాపమెఱుఁగు
పరమాత్మ తమ ధను ♦ ర్బాణమాహాత్మ్యము
వాసవాత్మజుఁడైన ♦ వాలియెఱుఁగు
వనజాక్ష తావక ♦ వనమాలమహిమను
వాయుసుతుండంజ ♦ నేయుఁడెఱుఁగు

తే॥ గీ॥ రామనామమహిమ నుమా ♦ రమణుఁడెఱు
నిలను నావంటి దౌర్భాగ్యుఁడేమియెఱుఁగు

సీ॥ కందర్పజనక శ్రీ ♦ కాంతామనోహర
దంతీంద్రుఁ డుదకంబు ♦ దాఁ ద్రిపుచుండి
మకరిచేఁ జిక్కియా ♦ మాధవా నను గాచి
రక్షించుమని వేఁడ ♦ తక్షణంబె
గుడుసుదైదవుచేతఁ ♦ గుంభీర శీర్షము
ద్రుంచియు గరిని ర ♦ క్షించినావు
శరణన్న రక్షించు ♦ బిరుదు గల్గినయట్టి
పురుషోత్తముఁడవీవె ♦ భుజగశయన

తే॥ గీ॥ శాత్రవులఁజంప వివిధవే ♦ షములఁదాల్చి
భక్తులను దయఁజూచెడిఁ ♦ బ్రభుఁడవీవె ॥ప్ర

భక్త రామచంద్ర శతకము.

సీ॥ నీరజగర్భుని ♦ నిగమము ల్గొనిపోయి
సోమకాసురుఁడబ్ధిఁ ♦ జొచ్చిడాఁగ
మీనమై జలనిధి ♦ లోనఁజొచ్చియు శ్రుతుల్
దెచ్చి విధాతకు ♦ నిచ్చినావు
కలశాబ్ధి మథియింపఁ ♦ గమఠరూపముఁదాల్చి
తరిగిరి మోసిన ♦ దైవమీవె
పోత్రివై హాటక ♦ నేత్రుని వధియించి
ధాత్రి నిల్పినయట్టి ♦ ధన్యుఁడీవె
తే॥ గీ॥ కనకకశిపునిఁ జీల్చియుఁ ♦ గనకవసన
భక్తప్రహ్లాదుఁగాచిన ♦ ప్రభుఁడవీవె ॥ భ ॥ 18

సీ॥ చక్రహస్త రమేశ ♦ సర్వేశ బలిని మూఁ
డడుగు లవనిదాన ♦ మడిగియతని
పాతాళమునకును ♦ పదఘట్టనంబున
నణఁగద్రొక్కిన వామ ♦ నావతార
ధరణీశుల శిరము ♦ లిరువది యొకసారు
లెలువకద్రుంచిన ♦ పరశుహస్త
రామచంద్రుండవై ♦ రఘుకులంబునఁబుట్టి
లంకేశు నిలఁ గూల్చి ♦ పంకజాక్ష
తే॥ గీ॥ లోకభయములు దీర్చితౌ ♦ లోకరక్ష
వివిధ చరిత్ర్యర్ధిగజసింహ ♦ విదళితాంహ ॥ భ ॥ 19

# ప్రత్యక్ష రామచంద్ర శతకము.

సీ॥ జయజయ రఘురామ ♦ జయ జగదభిరామ
జయజయ శుభనామ ♦ భయవిరామ
జయజయ రణశూర ♦ జయ శత్రుసంహార
జయ మేరు సమధీర ♦ జయవిహార
జయజయ దశవేష ♦ జయ భక్త జనపోష
జయ మౌనిహృత్తోష ♦ జయవిశేష
జయ మన్మథాకార ♦ జయమందరోద్ధార
జయ జగదాధార ♦ జయవిచార

తే॥ గీ॥ జయము నీదివ్యనామ వి ♦ జయము జయమ
జయము చేకూర్చి యేలుమా ♦ సార్వభౌమ

సీ॥ దాశరథీ పరం ♦ ధామ పరాత్పర
పాపవిమోచన ♦ భక్తవరద
జననిగర్భమునుండి ♦ జన్మించినది మొదల్
సౌఖ్యంబులేకను ♦ స్వాంతమం దు
హర్షంబులేకెపు ♦ డష్టకర్మంబులు
బాధింపుచుండె నా ♦ పాపమే మొ
తొలిజన్మమందు నే ♦ ద్రోహముల్ జేసితో
దప్పక బాల్పడె ♦ ధరణిలోన

తే॥ గీ॥ అనుభవింపంగఁ జాలనేఁ ♦ డక్కటకట
యెంత వ్యర్థపు జన్మంబు ♦ నెత్తినాఁడ ।భ॥

సీ॥ మమజన్మ నక్షత్ర ♦ మహిమ యేమోగాని
జ్ఞానహీనుఁడనైతి ♦ జగతియందుఁ
బరుల మేలును జూచి ♦ భావమందునఁ జాల
సంతోష పడనట్టి ♦ జడుఁడ నేను
దురితకృత్యంబుల ♦ నెఱిఁగి యెఱుంగక
వర్తించినట్టి ♦ దుర్వర్తనుఁడను
సాధు సజ్జనులతోఁ ♦ జనువుగా నెప్పుడైన
మెలఁగ నేరనియట్టి ♦ ఖలుఁడఁగాన

తే॥ గీ॥ ఇట్టి దుర్మార్గుఁడని మదిఁ ♦ యెంచకయ్య
తప్పులన్నియు మన్నించి ♦ దయను జూడు ॥భ॥ 22

సీ॥ తీర్థయాత్రిలకైనఁ ♦ దిరిగి సత్పుణ్యంబు
నార్జించుదామంటె ♦ నడుగ లేను
అనఘ కృష్ణాస్నాన ♦ మాచరించుదమంటె
చలియటంచును మానుఁగఁ ♦ జాలనయ్య
తపమొనరించి నీ ♦ దరి జేరుదామంటె
నిష్ఠచే స్వాంతంబు ♦ నిలుపలేను
భక్తితో నీనామ ♦ భజనసేయుదమంటె
సంతతాచారము ♦ ల్నిలుపలేను

తే॥ గీ॥ కష్టములకోర్వ నావల్లఁ ♦ గాదుసుమ్మి
యెటుల కడతేర్చెదవొ గాని ♦ యెఱిఁగనైతి ॥భ॥

సీ॥ బోధగురుని పాద ♦ పూజసేయుదమంటె
చిత్తచాంచల్యము ♦ చిక్కగల్గె
భిక్షువుర్ధులకేను ♦ బెట్టువారమనగొంటె
పాడుపొట్టకె వెతల్ ♦ బడుచునుంటి
ద్రవిణంబు తెఱవతో ♦ ధర్మమిచ్చుదమంటె
లేమిచేఁ గాసైన ♦ లేనుచేత
స్థిరమౌ ప్రతిష్ఠలు ♦ జేయించువారమంటె
సాధ్యంబుగాదె యీ ♦ జన్మమునను

తే॥ గీ॥ శక్తిగొలఁదిక నీనామ ♦ స్తవముజేతు
నింతకంటెను నాచేత ♦ నేమిగాను ॥ భ ॥  24

సీ॥ శ్రీరామ నీసేవఁ ♦ జేయుటనావంతు
నెనరుతోఁ ఎన్నఁల ♦ నీదెవంతు
అపరాధిఁనంచు ని ♦ న్నర్థింపనావంతు
నేర్పుచేమన్నింప ♦ నీదెవంతు
పరులవేఁడకనిన్ను ♦ బ్రార్థింపనావంతు
నిరతంబుఁగాపాడ ♦ నీదెవంతు
ముదముతోనీకు నే ♦ మ్రొక్కుటనావంతు
నిజముగా దీవింప ♦ నీదెవంతు

తే॥ గీ॥ నమ్మి యాత్మనుభజియింప ♦ నాదువంతు
నేఁడుమఱువక రక్షింప ♦ నీదెవంతు ॥ భ ॥  25

సీ॥ శతవత్సరములని ♦ మితము జెప్పిరిగాని
బ్రదుకునే మనుజుండు ♦ బ్రతికె నేని
సగమంధకారంబుఁ ♦ జను సుషుప్త్యవస్థ
లను బాలకౌమార ♦ మునను గొంత
జవ్వనంబునఁగొంత ♦ సంసారవ్యవహార
వృద్ధాప్యమునఁగొంత ♦ వివిధగతులఁ
గాలమంతయు వృథా ♦ గడుపుకొనుచుమది
నిన్నుఁదలఁచుటకు ♦ నిమిషమైన

తే॥ గీ॥ మఱియు నవకాశమును లేక ♦ మనుజులెల్ల
వ్యర్థులై చెడిపోదురీ ♦ వసుధలోన ॥ భ ॥

సీ॥ పక్షిరాడ్వాహన ♦ భావజజనక నా
మఃవినాశకర్త్రింమ ♦ మానవుండు
సారమ్ము లేని సం ♦ సారాబ్ధినీదుచు
మాయప్రపంచము ♦ మహిమచేత
సిరియు సంపదయు సు ♦ స్థిరమని మదిలోన
నెట్టివీగుట కడు ♦ వెట్టిగాద
యిమ్మహీస్థలిమీఁద ♦ నెంతటివారైన
జననమొందుట మఱి ♦ చావుకొఱకె

తే॥ గీ॥ అల్పభోగంబులను నమ్మి ♦ యాశపడుట
నార్థకంబును లేదయ్యొ ♦ సత్యముగను ॥భ॥

సీ॥ కాయంబు జాగ్రత్త ♦ గాను పోషించిన
దేహము న్విడనాడి ♦ దేహి పోవు
కడు భయాత్ములగుదు ♦ గహనభూములయందు
దాగిన యాపదల్ ♦ దప్పవండ్రు
కానున్న కార్యమ్ము ♦ గాకపోవదు సుమ్మి
జాలినొందఁగ నేల ♦ సుచితంబు
కసిబూని పరమేష్ఠి ♦ నొసట వ్రాసినవ్రాతఁ
దప్పింప నెవ్వరి ♦ తరముగాదు

తే॥ గీ॥ కాలకర్మంబు తొలఁగకఁ ♦ గదిసినపుడు
అనుభవింపకఁ దీరదీఁ ♦ యవనిలోన ॥భ॥ 28

సీ॥ తనువు నిత్యముగాదు ♦ మనుజుండు ముదిమినో
బాల్యమందునో మంది ♦ ప్రాయమందో
పండుటాకులు రాలు ♦ భాతిని దేహంబు
నుండబోదిది పుట్టి ♦ కుండవిధము
జలముపై బుద్బుద ♦ సరణియునఁగ వృష్టి
బిందువాకుననిల్చు ♦ చందమరయ
కలగని మేల్కొన్న ♦ గతిమాయకాయంబు
గాలిలోపల దీప ♦ కరణి నెపుడొ

తే॥ గీ॥ నాశనముజెందు తనువును ♦ నమ్మిమిగుల
మిట్టిపడుదురు నరజన్మ ♦ మిట్టిదనక ॥ భ ॥ 29

సీ॥ తథ్యంబుగాను భూ ♦ తలమందు నెప్పుడే
యూరనో జనుచున్న ♦ దారియందొ
దండకాటవియందొ ♦ దావాగ్నియందునో
యెండవానలయందొ ♦ నిదియుఁగాక
నీటియందునొ మృగ ♦ నికరంబు వల్లనో
గృహమందునో కొండ ♦ గుహాలయందో
భత్యంబులేకనో ♦ బాధలచేతనో
యెప్పుడో మరణంబు ♦ తప్పబోదు

తే॥ గీ॥ దండమృత్యువు గాచుక ♦ నుందుగాన
తెలియఁజాలక స్థిరమని ♦ పలుకనేల ॥ భ ॥ 3

సీ॥ కాలంబుచేకూడి ♦ కాలకింకరులచేఁ
జిక్కియు శ్రమనొంది ♦ సొక్కియుండి
కాయంబు స్మృతిఁదప్పి ♦ కంపమొందుచునిన్ను
ధ్యానింపనేరకఁ ♦ దల్లడిల్లి
విడువఁజాలక నిల్లు ♦ వెడలిపోలేకను
గుటగుటప్రాణముల్ ♦ గొట్టుకొనుచు
దిక్కులు వీక్షించి ♦ దిక్కెవ్వరని మది
భీతిచే జింతించి ♦ యాతురమునఁ

తే॥ గీ॥ దలఁచనేర్తునో మమతచేఁ ♦ దలఁచలేనో
తెలివియుండఁగనే నిన్ను ♦ గొల్చుదేవ ॥భ॥

[3] ప్ర త్య క్ష రా మ చం ద్ర శ త క ము.

సీ॥ ఋణబంధములు దీరి । క్షణములో జీవుండు
పైనమై చనుచున్నఁ । బట్టలేక
యేమి సెప్పెదవని । యేడ్తు రింతియె కాని
చావు దప్పింపఁగాఁ । జాలరైరి
శయ్య చుట్టును జేరి । కుయ్యో మొఱ్ఱో యందు
రయ్యెడ నాయుష్య । మియ్యలేరు
బంధుమిత్రులు దుఃఖ । పడుటమాత్రమె కాని
యడ్డగింప నెవరి । కలవిఁగాక

తే॥ గీ॥ తప్పకను దండధరునకు । నొప్పగింత
పెట్టి చూచుచుందురీ । పృథివిలోన ॥భ॥

సీ॥ కఫవాతపైత్యముల్ । గమ్మకమున్న నే
నిప్పుడే ధ్యానింతు । నిచ్చకొలఁది
నారాయణ, కృష్ణ । నగధర కేశవ
మాధవ పద్మాక్ష । మదనజనక
దామోదర ముకుంద । దైత్యారి గోవింద
వనమాలి కంసారి । వాసుదేవ
తార్క్ష్యవాహన జనా । ర్దన జగన్నాయక
శ్రీరమావల్లభ । శ్రీనివాస

తే॥ గీ॥ యనుచుఁ బాడియుంతు భక్తితో । ననుదినంబు
పావనంబైన వైకుంఠ । పదవినొసఁగు ॥భ॥

సీ॥ తరలిపోయెడివేళ । తనవారలెందఱో
సాగనంపుటకన్న । నొకఁడు భూమి
వలనను నేతెంచియుండఁ । దిరిగైనఁ జూచక
మరలిపోయెద రంత । మరులువీడి
పోవునప్పుడుఁదాను । పోకైనఁగొనిపోవఁ
డంతులేనియు ధన । వంతుఁడైన
కాయంబు మెండుగాఁ । గండలుఁబెంచుక
కాటిపాల్ జేయుటే । గానితనకు

తే॥ గీ॥ సుకృతమదుష్కృతముల్ రెండు । సుస్థిరముగ
వెంటవచ్చు మఱియెవరు । జంటరారు ॥భ॥ 34

సీ॥ పుత్రమిత్రకళత్ర । పౌత్రసంతతిసహో
దరాతాపితాగ్రజ । భ్రాతలాది
అక్క చెల్లెం డ్రత్త । లల్లుండ్లు మామలు
బావలు మఱఁదులు । బంధుబృంద
మెక్కడివారలు । నిక్కంబునరయఁగా
నెవరికివారలే । యేమిలేదు
ఋణవిశేషముచేతఁ । బృథివిపైజన్మించి
మమకా న వట్టి । మాయచేత

తే॥ గీ॥ వాయువీరని తలఁచుట । సారమేమి
నీకెఱింగించినయార్యుండు । నాకుగాఁడె ॥భ॥ 35

సీ॥ జంభారినుతరామ ♦ జనకుండవీవె నా
జనని సీతాదేవి ♦ జగతియందు
భరతశత్రుఘ్నులున్ ♦ బరగ లక్ష్మణస్వామి
పినతండ్రులనియెంతు ♦ బిసరుహాక్ష
తమదాసజాలంబు ♦ మమబంధువర్గంబు
నీసేవకు లనుచు ♦ నేస్తకాండ్రు
నీవాహనంబైన ♦ నిజబంటు శ్రీయాంజ
నేయుండు నాకు స ♦ హాయబలిమి

తే॥ గీ॥ కలిమి బలగమిందఱు సదా ♦ కలిగియుండెఁ
గామధేనువు ముంగిటఁ ♦ గలిగినట్లు ॥భ॥

సీ॥ బెల్లంబుగలచోట ♦ కొల్లగా నీఁగెలు
చీమలు గుంపులై ♦ చేరినట్లు
నీరు తటాకంబు ♦ నిండినఁబిమ్మట
భూరిమండూకముల్ ♦ జేరినట్లు
భాగ్యంబుగల్గిన ♦ బంధువు లనిశంబు
పత్తురు మఱిమఱి ♦ వసుధలోన
కలిమిపోయినవెన్కఁ ♦ గానరాగవరైన
విరులు వాడినభృంగ ♦ విధముగాను

తే॥ గీ॥ ర్కోసి నిండుపల్లపై భ్రమున్ ♦ దీసివేసి
స్వాంతముననిన్ను నమ్ముటే ♦ సార్థంబు ॥భ॥

సీ॥ ఎన్నిజన్మంబులఁ ♦ నెత్తితినో తొల్లి
యికమీఁద నేజన్మ ♦ మెత్తువాఁడ
కర్మానుబంధముల్ ♦ కడకుఁబోఁద్రోచియు
యిహమందుసౌఖ్యంబు ♦ నిచ్చిపిదప
పరమందుభవదీయ ♦ పంకజాంఘ్రులసేవ
సమకూర్పవేనాకు ♦ సంతతంబు
నిన్ననమ్మితిరామ ♦ నిజముగా నా యిష్ట
దైవమటంచును ♦ దలఁచుచుంటి

తే॥ గీ॥ దాసదాసుఁడ ననుఁబ్రోవు ♦ దంతివరద
ముక్తిదాయక లక్ష్మీశ ♦ ముంజకేశ! ॥భ॥ 38

సీ॥ తలఁచెదనామదిఁ ♦ దనివితీరంగను
రామనామము నేఁడు ♦ రమ్యముగను
భజియింతుమత్పూర్వ ♦ పాతకంబు ద్రోలంగ
రామనామము నేఁడు ♦ రమ్యముగను
స్మరియింతు నాజన్మ ♦ సఫలంబునౌటకు
రామనామము నేఁడు ♦ రమ్యముగను
ప్రస్తుతించెద మోక్ష ♦ పదవిఁ జెందుటకేను
రామనామము నేఁడు ♦ రమ్యముగను

తే॥ గీ॥ దీనవరదుఁ డవని యోర ♦ దీక్షచేతఁ
బొగడుచుందును నాపాలి ♦ స్ఫూర్తిగాను ॥భ॥ 39

సీ॥ రామనామామృత । రసముతో సరియౌన
మాధుర్యమైనట్టి । మధుకమైన
రామనామామృత । రసముతో సమమౌన
పనస ఖర్జూరాది । ఫలమ్ములైన
రామనామామృత । రసముతో విభవౌన
సారమయినతీపి । చక్కెరైన
రామనామామృత । రసముతోఁ బ్రబలౌన
పాలు మీగడ దధి । భక్ష్యమైన

తే॥ గీ॥ రామనామామృతముసాటి । రావుగాన
రామనామామృతముభక్త । రక్షణంబు ॥భ॥ 40

సీ॥ వటభూరుహమ్ముక్రింద । వాల్మీకి జపియించె
రామతారకమంత్ర । రాజ మరయ
హిమగిరి సుతకు మ । హేశుండు బోధించె
రామతారకమంత్ర । రాజ మరయ
ఆంజనేయుని మది । రంజిల్లుచున్నది
రామతారకమంత్ర । రాజమరయ
హరిజ విభీషణుల్ । నెరనమ్మి కొనియాడె
రామతారకమంత్ర । రాజమరయ

తే॥ గీ॥ సకలలోకంబులను నిండి । సాంద్రముగను
ప్రజ్వరిల్లు రామమంత్రంబు, పతనసేతు ॥భ॥ 41

సీ॥ రామయ్య నీదివ్య ♦ నామమంత్రముచేత
భూతభేతాళితోఁ ♦ బోరవచ్చు
రామయ్య భవదీయ ♦ నామమంత్రముచేత
మొండిగ్రహంబులఁ ♦ జెండవచ్చు
రామయ్య తమభవ్య ♦ నామమంత్రముచేతఁ
దంతు లుచ్చాటనల్ ♦ దఱుమవచ్చు
రామయ్య తారక ♦ నామమంత్రముచేతఁ
గట్టుపోతులనోళ్ళు ♦ గట్టవచ్చు

తే॥ గీ॥ పరభయంబులనెల్లఁ గా ♦ పాడుననుచు
భళిర నీనామమంత్రంబు ♦ బ్రస్తుతింతు ॥భ॥ 4

సీ॥ శ్రీరామనామ కం ♦ ఠీరవంబున బహు
శత్రుసామజములఁ ♦ జంపవచ్చు
శ్రీరామనామ శో ♦ చిష్కేశకీలచేఁ
గలుష ఘోరాటవుల్ ♦ గాల్పవచ్చు
శ్రీరామనామ రా ♦ జీవాప్త శోభచే
భయదాంధకారంబుఁ ♦ బాపవచ్చు
శ్రీరామనామ లక్ష్మీ ♦ భూతి నావచే
దారిద్ర్యవారాశి ♦ దాటవచ్చు

తే॥ గీ॥ పరగ రామనామ మనెడు ♦ పవనుచేత
గొడవయనెడు మేఘములు వో ♦ గొట్టవచ్చు ॥భ॥ 4

సీ॥ శ్రీమించు జగదభి ♦ రామనామముచేతఁ
జింతార్ణవముదరిఁ ♦ జేరవచ్చు
రఘుకులోత్తముఁడైన ♦ రామనామముచేత
ఘోరదానవులను ♦ గూల్పవచ్చు
రాజితంబైన శ్రీరామనామముచేతఁ
గాలదూతలఁ బార ♦ దోలవచ్చు
కామితార్థములిచ్చు ♦ రామనామముచేత
బొందితో మోక్షంబుఁ జెందవచ్చు

తే॥ గీ॥ రామనామము కిల్బిష ♦ రహితసురయ
రామనామంబు సాధు ♦ సంరక్షణంబు ॥భ॥ 44

సీ॥ శ్రీరామనామ సంజీవి యౌషధముచే
మృత్యువును జయించి ♦ మెలఁగవచ్చు
శ్రీరామనామ సం ♦ జీవి యౌషధముచే
బహుజన్మ కర్మముల్ ♦ బాపవచ్చు
శ్రీరామనామ సం ♦ జీవి యౌషధముచే
షడ్గుణంబులునిల్పఁ ♦ జాలవచ్చు
శ్రీరామనామ సం ♦ జీవి యౌషధముచే
సుజ్ఞాన మనుజ్యోతిఁ ♦ జూడవచ్చు

తే॥ అనఘ నీనామ సంజీవి ♦ యౌషధమున
నతులితాయు రారోగ్యము ♦ లతిశయిల్లు ॥భ॥ 45

సీ॥ తంతుబాధకి రామ। తారకంబేగాని
మాయమంత్రములెంత। మాత్రమొల్ల
రోగంబులకు రామ। యోగిమందులెకాని
మాయమందులు నెంత। మాత్రమొల్ల
గ్రహభీతికిని రామ। మహిమయంత్రమెకాని
మాయరక్షలు నెంత। మాత్రమొల్ల
గతినేఁడు శ్రీరామా! కాంతుఁడంటినిగాని
మాయదేవుల నెంత। మాత్రమొల్ల

తే॥ గీ॥ సంతతము రామకథ లాల। కింతుగాని
మాయనరుల చరితలెంత। మాత్రమొల్ల ॥భ॥

సీ॥ ధరణిలోఁ దమసాటి। దైవంబు లేఁడని
పారెసారెకుఁ న్నను। సంస్మరింతు
శత్రులవధియించి। జయకీర్తి వడసిన
కపికేతనం బెత్తె। ఘనముగాను
భూనభోంతరమొల్ల। భోరుకొల్పఁగ భేరి
ధణాధణావాయింతు। ధ్వనులు చెలఁగ
రాజరాజార్చిత। రఘుకుల సంజాత
రామ నీమహిమను। రాత్రిఁబవలు

తే॥ గీ॥ ఘంటఁగట్టి ప్రమాయింతు నీ। కంటెఘనుఁడు
ఎందు లేఁడని పొగడెద। వందవిధము ॥ భ ॥

సీ॥ రామచంద్రుఁడు దక్క । భూమిలో వేఱొక్క
సత్యప్రతిజ్ఞుఁడౌ । స్వామి లేఁడు
సీతాపతి మినహా । సిరులనొసంగుచు
భక్తుల రక్షించు । ప్రభువు లేఁడు
దశరథాత్మజుఁడవు । దాతృత్వమునుగల
యాశ్రితపోషణుం । డవని లేఁడు
కౌసల్యానందను । కంటె దయానిధిఁ
గనఁగొన నటకు నెందుఁ । గానరాఁడు

తే॥ గీ॥ అనుచు నెఱనమ్మి సతతంబు । వినుతిఁ జేతుఁ
దంతిపోషక నీకన్న దైవమెవరు ॥ధ॥ 48

సీ॥ సైకతంబును గూర్చి । జగతిలో నెవ్వరైన
వరుసగా లెక్కింప । వచ్చుగాని
రేప్రకాశించెడు । రిక్కలవీక్షించి
వరుసగా లెక్కింప । వచ్చుగాని
వడిగాను గురిసెడి । వర్షబిందువులను
వరుసగా లెక్కింప । వచ్చుగాని
నలినాక్ష రామ నీ ॥ నామప్రభావంబు
వారక లెక్కింప । వశముఁ గాదు

తే॥ గీ॥ వేయికన్నులు గల్గిన । వేల్పుకైనఁ
దరము వర్ణింప వేయ్యేల । ధాతకైన ॥ధ॥ 49

సీ॥ హస్తీంద్రుఁడెవ్వని ♦ నార్తుఁడై మొఱఁబెట్టె
ప్రహ్లాదుఁడెవ్వనిఁ ♦ బ్రస్తుతించె
సుగ్రీవుఁడెవ్వని ♦ స్తుతియించిహితుఁడయ్యెఁ
బావని యెవ్వని ♦ భక్తుఁడయ్యె
సదమలాత్ముఁడు విభీ ♦ షణుఁడు భీతిల్లుచు
శరణంబు నెవ్వని ♦ చాటుఁజొచ్చె
పాంచాలిసభలోన ♦ భంగమొందెడివేళ
నెవ్వనిఁ బ్రార్థించె ♦ నింపరేశ

తే॥ గీ॥ వీరిచే నుతింపఁబడిన ♦ వేల్పువీవె
యనుచు వేఁడెద గావమే ♦ యనుదినంబు ॥భ॥ 5

సీ॥ దండంబు దండంబు ♦ దశకంఠసంహార
రక్షించు రక్షించు ♦ రామచంద్ర
కేల్మోడ్తుఁ గేల్మోడ్తుఁ ♦ గిల్బిషధ్వాంసకా
రక్షించు రక్షించు ♦ రాఘవేంద్ర
జోహారు జోహారు ♦ సుమనసవందితా
రక్షించు రక్షించు ♦ రఘుకులేంద్ర
సాష్టాంగముగ నమ ♦ స్కారంబుఁ జేసెద
సుజనౌఘసంరక్ష ♦ సుగుణసాంద్ర

తే॥ గీ॥ శరణు కుంజరపోషణ ♦ దురితహరణ
స్తుతియొనర్చెద మాంపాహి ♦ సుస్థిరముగ ॥భ॥

సీ॥ దశరథాత్మజనిన్ను ♦ దర్శించుటేచాలు
నఘనాశమై పుణ్య ♦ మబ్బినట్లు
పూలచేఁదమపాద ♦ పూజసేయుటెచాలు
నలచేతవైకుంఠ ♦ మమరినట్లు
వనజాక్షభవదీయ ♦ వలగొనుటేచాలు
భూప్రదక్షిణముకై ♦ పోయినట్లు
భక్తిచేతనునీకుఁ ♦ బ్రణమిల్లుటేచాలుఁ
గైవల్యసంప్రాప్తిఁ గలిగినట్లు

తే॥ గీ॥ ఉల్లమందున నినునమ్మి ♦ యున్నఁజాలుఁ
జక్కఁగాఁగోరికలు కొన ♦ సాగినట్లు ॥భ॥ 5[illegible]

సీ॥ శ్రీరామనామము ♦ చింతఁజేసితెచాలు
సకలశాస్త్రంబులుఁ జదివినట్లు
శ్రీరామనామము ♦ చెవులసోకినఁజాలు
వేదపురాణముల్ ♦ వినినయట్లు
శ్రీరామనామము ♦ చేతవ్రాయుటెచాలు
శ్రేష్ఠమౌవ్రతములు ♦ జేసినట్లు
శ్రీరామనామ ప్ర ♦ సిద్ధిజేసినఁజాలు
కాంచనశిఖరమె ♦ త్రించినట్లు

తే॥ గీ॥ అవనిజాధీశ నినుదైవ ♦ మనుటెచాలు
పుణ్యతీర్థముల్ సేవింపఁ ♦ బోయినట్లు ॥భ॥ 5[illegible]

సీ॥ దినగండములు తొలఁగి ♦ దీర్ఘాయువుం గల్గుఁ
దిరుమణి నొసటను ♦ దిద్దియున్న
దినగండములు తొలఁగి ♦ దీర్ఘాయువుం గల్గుఁ
దారకమంత్రముం ♦ దలచుచున్న
దినగండములు తొలఁగి ♦ దీర్ఘాయువున్ గల్గుఁ
శ్రీవక్షాభరణము ♦ గ్రీవనున్న
దినగండములు తొలఁగి ♦ దీర్ఘాయువుం గల్గుఁ
శ్రీరామరక్షయుం ♦ జేతనున్న

తే॥ గీ॥ అనిశమును గండములఁ గాతు ♦ వనుచు నమ్మి
ప్రతిదినంబును నీనామ ♦ భజన సేతు ॥ భ ॥

సీ॥ సాకేతపురివాస ♦ జానకీరామ నీ
హితభావమును రవి ♦ సుతున కెఱుక
తరణివంశోత్తమా ♦ దశరథరామ నీ
సత్యవాక్యము విభీ ♦ షణున కెఱుక
వారిజదళనేత్ర ♦ వైదేహిరామ నీ
పరిపూర్ణకృప భక్త ♦ వరుల కెఱుక
సామజసంరక్ష ♦ రామ నీవే మోక్ష
దాయకుఁడనుచు జ ♦ టాయి కెఱుక

తే॥ గీ॥ ఆర్తజనులను బ్రోచిన నీ ♦ యాత్మ కెఱుక
నమ్మినా నిన్ను మఱువక ♦ నమ్మవలెను ॥ భ ॥

సీ॥ సాక్షాత్తువైకుంఠ ♦ సదనుఁడౌగావున
కౌశికయాగంబుఁ ♦ గాచినావు
కేవల శ్రీరమా ♦ దేవుఁడౌగావున
నీరధిపైగిరుల్ ♦ నిల్పినావు
ముఖ్యంబుగా విష్ణు ♦ మూర్తివిగావున
ఘోరదానవులను ♦ గూల్చినావు
పదివేషములుఁదాల్చు ♦ భగవంతుఁడవుగాన
నిఖిలజగంబుల ♦ నిండినావు

తే॥ గీ॥ రామ మయమయ్యె నంతట ♦ రాజితముగ
దాసజన హృదయాబ్జ ని ♦ వాసమయ్యె ॥ భ ॥

సీ॥ రామచంద్రానన్ను ♦ రక్షింపఁ గలవని
యన్యదేవులఁ గొని ♦ యాడనెపుడుఁ
గలవందురమర నం ♦ ఘములందు గోవిప్ర
మునులందు భక్తస ♦ మూహమందు
నున్నావొ లేవొ లే ♦ కెన్నఁడైననుగాని
గాన్పించ వదియేమి ♦ కారణమున
యేరూపమునుదాల్చి ♦ యెచటనుంటివొగాని
యేవిధంబుననైన ♦ నెఱుఁగజా●

తే॥ గీ॥ నీదుమాయఁదెలియుటకు ♦ నిశ్చయముగ
వశము గాదందు రెంతటి ♦ వారికైన ॥ భ ॥

సీ॥ శ్రీమనోహరనీదు ♦ జీమూతకాయంబు
విశ్వరూపమటంచు ♦ వింటిఁగాని
నేత్రోత్సవంబుగా ♦ నేఁజూడవలెనంచు
నిజవేషమునవచ్చి ♦ నిల్వవేమి
దుష్టమానవ్రకను ♦ దృష్టిఁదాకునటంచు
దర్శనంబియ్యక ♦ దాగినావొ
నామదిఁగనుటకు ♦ నాగాంతకతురంగ
పరికింపుచుంటివో ♦ భావమందుఁ

తే॥ గీ॥ దలఁచినప్పుడే నామ్రోల ♦ నిలువరాద
భుజఁగమృదుతల్ప నీపాద ♦ పూజసేతు ॥ భ ॥ 5

సీ॥ కౌసల్య సుకుమార ♦ కారుణ్యసాగర
భక్తౌఘసంరక్ష ♦ పంకజాక్ష
భక్తిచేతనునిన్ను ♦ భావమందుననమ్మి
యున్నవాఁడనుగదా ♦ యోమహాత్మ
యెంతవేడినఁగాని ♦ సుంతైనదయలేదు
పంతమానామీఁదఁ ♦ బద్మనాభ
దిక్కునీవేయని ♦ మ్రొక్కుచుంటిని పెక్కు
చిక్కులుబెట్టకు ♦ నిక్కముగను

తే॥ గీ॥ కంటికిని రెప్పవలెనన్నుఁ ♦ గాచెదవని
నిన్నుమఱుపక సతతంబు ♦ సన్నుతింతు ॥ భ ॥

సీ॥ గుహుఁడు నీ కేపాటి ♦ బహుదాస్యమును జేసె
శ్రీరామ బహుసంత ♦ సించినావు
శబరి నీ కేపాటి ♦ చాలఁగా భక్తిఁదీర్చె
శ్రీరామ బహుసంత ♦ సించినావు
ఉడుత నీ కేపాటి ♦ యూడిగంబులు సేసె
శ్రీరామ బహుసంత ♦ సించినావు
కపులు నీ కేపాటి ♦ కడు సహాయం బైరి
శ్రీరామ బహుసంత ♦ సించినావు

తే॥ గీ॥ చేతనైనంతవఱకు నీ ♦ సేవఁ జేతు
సంశయింపక నన్నుఁ బ్రోవు ♦ సంతసమున ॥ భ ॥

సీ॥ జోహారు జోహారు ♦ జోహారు జేసెదఁ
గరుణానాయ యందంచు ♦ కనకచేల
తల్లిదండ్రి నీవె ♦ దైవంబు నీవని
సంతసిల్లుచునుంటి ♦ సదమలాత్మ
కన్నపుత్రుని వలెఁ ♦ గాపాడి రక్షించు
ప్రేమాతిశయమున ♦ బినసుహాతు
ఇహలోకమంను నే ♦ నెల్లకప్పుడును తమ
పాదసేవకుఁడను ♦ పరమపురుష

తే॥ గీ॥ నేఁడు నను బ్రోచె భారంబు ♦ నీదె సుమ్మి
దీనరక్షక బిరుదాంక ♦ దేవదేవ ॥ భ ॥

సీ॥ శ్రీనాథ నీభార్య ♦ యైన శ్రీలక్ష్మి
సేవింప శాశ్వత ♦ సిరులొసంగు
పుండరీకాక్ష నీ ♦ పుత్రుండౌ విధికి జో
హారుచేసిన చి ♦ రాయువొసఁగు
సురనుత నీపాద ♦ సుతయైన గంగలో
మునిఁగిన జన్మ పా ♦ వనమొసంగు
దామోదర తమ సు ♦ దర్శనమును వేఁడ
శత్రులఁ ఛేదించి ♦ జయమొసంగు

తే॥ గీ॥ నిన్ను ధ్యానింపఁ దలఁగేమి ♦ నిగమచరిత
కామితార్థములొసఁగెడి ♦ ఘనుఁడవీవె ॥ భ ॥ 62

సీ॥ జిష్ణు సన్నుత యాది ♦ విష్ణుమూర్తివినీవె
శంఖ చక్రములిరు ♦ వంకలనురి
శరణుజొచ్చినభక్త ♦ వరులఁ గాచెదనంచు
బిరుదువహించిన ♦ దొరవునీవె
దీనజనులకెల్ల ♦ దిక్కునీవగుచుఁ బ్రి
సిద్ధిఁ జెందితివని ♦ చిత్తమందు
వేమాఱుమఱువక ♦ వినుతింప నీనుదిన్
గరిన మించుకయైనఁ ♦ గలుగదామె

తే॥ గీ॥ నేమిసేయుదు నాకింక నెవరుదిక్కు
నీవెగలవని నమ్మితి ♦ నీరజాక్ష ॥ భ ॥ 63

# ప్రత్యక్ష రామచంద్ర శతకము.

సీ॥ పేదవాండ్రకునీవు ♦ పెట్టుటే లేదుగా
బహుళసొమ్మును దిన ♦ మఱిగినావు
చవిజూచి భక్తితో ♦ శబరియిచ్చుఫలంబు
ఎంగిలనక దిగ ♦ మ్రింగినావు
శ్రీలోలుఁడవుచూఁ కు ♦ చేలుండు యాచింప
బొక్కెడటుకులనీవు ♦ మెక్కినావు
విమలచిత్తుండైన ♦ విదురునింటికి నేగి
కూడు తనివిఁదీర ♦ గుడిచినావు

తే। గీ। వ్రేతలాంగన లిండ్లలో ♦ వెన్న దధియు
పాలు మీగడఁ దెగఁదిని ♦ బ్రతికినావు ॥భ॥

సీ॥ నీపొట్టనింపితే ♦ నీకదే హర్షంబు
పరుల క్షుద్బాధ నీ ♦ వెఱుఁగవయ్య
పెట్టిపొయ్యకయున్న ♦ పట్టిమూర్ఖైవను
బహుపీడ్రమగానీవు ♦ పలుకరాద
పలుకుట కిష్టంబు ♦ గలుగకున్నను కడు
వ్యాధిపీడితుఁజేయ ♦ న్యాయమగున
వ్యాధులుగల్పించి ♦ బాధించితివి సరే
మోక్షమొసంగక ♦ మూర్ఖుఁడనుచు

తే॥ గీ॥ మఱియు బ్రతికించితివి నీవు ♦ కరుణలేక
పుడమిపై నగచాట్లనేఁ ♦ బడుచునుంటి ॥

సీ॥ అపుడయోధ్యను బాసి ♦ యటవిభూములయందు
నున్ననాఁడది నీకు ♦ నొక్కచింత
అతివను గోల్పోయి ♦ యడలుచు న్వెదకుచు
నున్ననాఁడది నీకు ♦ నొక్కచింత
దశకంఠుచే నస్త్రాహ ♦ దరుఁడు మూర్ఛిల్లియు
నున్ననాఁడది ♦ నీకు ♦ నొక్కచింత
పతిని దోడ్కొనిరాఁగఁ జాకలి నిందించి
యున్ననాఁడది నీకు ♦ నొక్కచింత

తే॥ గీ॥ ఇన్నిచింత లనుభవించి ♦ యున్ననీకు
మనసు చెదరినఁ బోవుట ♦ మఱతువేమొ ॥భ॥ 74

సీ॥ నగధర నిను నెఱ ♦ నమ్మినందుకుగాను
నిప్పులంబాయెను ♦ నిశ్చయముగ
అందని పండ్లకై ♦ హస్తము ల్సాచుచుఁ
గోయఁబోయిన రీతి ♦ తోయజాక్ష
అతిదాహమైతోఁచ ♦ నరుగుచు నెండమా
వులఁ జూచి జలమని ♦ తలఁచినట్లు
మఱియు నుఁబైశాల్వ ♦ చెరగున వడగండ్లు
మూటఁగట్టినభంగి ♦ మంజకేశ

తే॥ గీ॥ ఆశలన్నియు నిపుడు ని ♦ రాశలాయె
జన్మమెత్తినఫలమేమి ♦ జగతియందు ॥భ॥ 7

సీ॥ హరిభక్తుని సజ్జనుల్ ♦ నరుఁడనిదుర్జనుల్
తర్కింపుచుందురు ♦ తథ్యముగను
భగవంతుఁడనుకొంటి భవదీయమహిమ నా
కించుకైనను గను ♦ పించదాయె
దివ్యదృష్టినిఁగల ♦ దేవుడవైనచో
భక్తులశ్రమ కండ్లఁ బడునుగాన
ధరణిపై రామావ ♦ తారమెత్తిన యపుడు
నిన్నునీ వెఱుఁగవు ♦ నిశ్చయముగ

తే॥ గీ॥ నన్నురక్షింతువనిమెట్లు ♦ నమ్మగలను
తెలిసెనీకీర్తి కడు తేట ♦ తెల్లముగను ॥భ॥

సీ॥ అలనాఁడు మకరిచే ♦ నాపదఁజెందిన
గజరాజునేలుట ♦ కల్లకల్ల
తండ్రిబాధకునోర్చి ♦ ధ్యానించినట్టి యా
ప్రహ్లాదుఁ బ్రోచుట ♦ బద్దుబద్దు
కౌశికుసవనంబుఁ ♦ గాచి ముగించుట
తథ్యంబుగాదది ♦ మిథ్యమిథ్య
శరణజొచ్చిన విభీ ♦ షణుని మన్నించియు
లంకనేలించుట ♦ బొంకుబొంకు

తే. గీ॥ ద్రౌపదికిఁ జీరలిచ్చుట ♦ దబ్బరబ్బ
మ్రొక్కు భక్తులఁబ్రోచుట ♦ టక్కుటక్కు ॥భ॥

సీ॥ హా భక్తమందార ♦ హా మేరునగధీర
హా శత్రుసంహార ♦ యఘవిదూర
హా జానకీలోల ♦ హా సత్యసంశీల
హా నతజనపాల ♦ గానలోల
హా జగద్రక్షక ♦ హా శుభదాయక
హా రఘునాయక ♦ మారజనక
హాపుండరీకాక్ష ♦ హాదీనసంరక్ష
హారమామణివక్ష ♦ వారిజాక్ష

తే॥ గీ॥ తెలిసి తెలియక నిందించి ♦ తిని యటంచు
చలము బూనకు నాతండ్రి ♦ శాంతమొందు॥భ॥78

సీ॥ స్త్రీహత్య జేసిన ♦ చెనటివి యంటినా
యేమనంటిని యిఁక ♦ నేమనంటి
చెరనున్నసీతను ♦ చేకొంటి వంటినా
యేమనంటిని యిఁక ♦ నేమనంటి
భరతు పాలనకు లోఁ ♦ బడితివి యంటినా
యేమనంటిని యిఁక ♦ నేమనంటి
గర్భిణీసతిఁబాసె ♦ నిర్భాగ్యుఁడంటినా
యేమనంటిని యిఁక ♦ నేమనంటి

తే॥ గీ॥ ఆత్మజులతో ననియొనర్చె ♦ ననఁగలేదె
యేమనంటిని నే నిఁక ♦ నేమనంటిఁ॥భ॥ 79

సీ॥ జానకీ హృదయేశ ♦ సాకేత నగరీశ
దనుజసంహారకరం ♦ దగ్రజనక
దంతీంద్రు నెటువలె ♦ దయఁజూచినాఁడవో
ప్రహ్లాదు నెటులఁ గా ♦ పాడినావో
శత్రు సోదరు విభీ ♦ షణుని మన్నించియు
లంకనేలింపవే ♦ శంకలేక
హాకృష్ణ కావవే ♦ యని ద్రుపదాత్మజ
మొఱబెట్ట, గను పుట్ట ♦ ములఁ నొసంగి

తే॥ గీ॥ వీరలందఱి నేరీతి ♦ వెలపుఁదీర్చి
కాచి రక్షించినాఁడవో ♦ తోఁచదాయె ॥భ॥ 64

సీ॥ అచ్యుతా నిన్ను నే ♦ నాశ్రయింతునటంచుఁ
గలశాబ్ధి సిలయమై ♦ నిలచినావు
అనఘాత్మ నిన్ను నే ♦ నాశ్రయింతునటంచుఁ
గుండలీందురిమిరాఁగఁ ♦ బాడినావు
అంబుజనాభ ని ♦ న్నాశ్రయింతు నటంచు
గరుడునెక్కి తిరుగ ♦ మఱిగినావు
హస్తిరాడ్వరద ని ♦ న్నాశ్రయింతునటంచు
ధరఁ బెక్కురూపముల్ ♦ దాల్చినావు

తే॥ గీ॥ ఇట్టి కపటచిత్తుఁడవని ♦ యెఱుఁగనైతి
నెందుదాఁగెదవిఁక నాశ్ర ♦ యించుటకును ॥భ॥ 65

సీ॥ పగచేతనైనను ♦ బాంధవంబుననైన
చెలిమిచేతను ♦ భక్తిచేతనైన
నిర్వాణనాయక నిన్ను ♦ జేరగవచ్చు
దక్షచేతను నిన్ను ♦ దిట్టిమైన
నారద తరిమైన పతి ♦ భీతిచేనైన
సౌఖ్యంబునను ♦ సంతతమునైన
జపతపనిష్ఠచే ♦ సద్వ్రతంబులనైన
రాత్రియు ♦ బగలైన రామరామ

తే॥ గీ॥ స్మరణజేసినవారికి ♦ జన్మజన్మ
పాపములుపోయి వై ♦ కుంఠపదవిగల్గు ॥భ॥ 6

సీ॥ కనకాక్షుడను హేమ ♦ కశిపుడు పంక్తికం
ఠరు కుంభకర్ణాది ♦ దంతవక్త్రి
శిశుపాలురును పగచేతను ♦ చివరకు
వైకుంఠద్వార ♦ నివాసులైన
ప్రహ్లాదుడును ♦ గజపతియును భక్తిచే
గైవల్యపదవినిగాంచినారు
బంధుత్వమున బాచపాండవుల్ ♦ నినుజేగ
చెలిమిచే ♦ ముక్తిచేలునకును

తే॥ గీ॥ వ్రతముజేసి ♦ రుక్మాంగద వసుమతీశ
ముఖ్యులందరి కిటువలె ♦ మోక్షమబ్బె ॥భ॥

సీ॥ పంకజాక్షా నిన్నుఁ ♦ బ్రార్థించినందుకు
మొఱనాలకించరా ♦ ముదముచేత
నీపాదపద్మముల్ ♦ నెఱనమ్మినందుకు
సంకటంబులఁబాపు ♦ సదమలాత్మ
దోసిలొగ్గియు నీకు । దాసుఁడైనందుకుఁ
జింతలన్నియు నెగ ♦ జిమ్ముమయ్య
పలుమాఱు నీకు జేఁ ♦ బ్రణమిల్లినందుకుఁ
గనికరంబుఁ బ్రోవు ♦ కమలనాథ

తే॥ గీ॥ నీవెగతి యనినందుకు ♦ నిశ్చయముగ
నన్ను నొకభక్తునిగఁజూడు ♦ నలిననేత్ర ॥భ॥ 68

సీ॥ శ్రీరామచంద్ర నీ ♦ సేవఁజేయుచునుంటి
దాక్షిణ్య మాత్మలోఁ ♦ దలఁచనేమి
కలకాలమును నాదు ♦ కర్మమేమోగాని
నిప్పచ్చరముచేతఁ ♦ దిప్పలయ్యె
శ్రీమంతుడవటంచు ♦ చేజాచి యడిగితే
జాలిలేదాయెను ♦ జలజనయన
ధరణిలోపల నాకుఁ దఱుగు లేదనుకొంటి
నామూలధనమని నమ్మియుంటి

తే॥ గీ॥ అద్రిజనకల్పభూరుహా ♦ మనసఁగవింకె
నిరత నిర్దయఁజూచెద ♦ వేటికయ్య ॥భ॥ 69

సీ॥ మారీచుఁడనుగాను ♦ మాయ కురంగమై
మోసగించుటకును ♦ మురవిదార
రావణుండనుగాను ♦ కావరంబుననీకు
నపకారమొనరింప ♦ నఘవినాశ
మైరావణుఁడఁగాను ♦ మన్నుజల్లియు నిన్ను
గొనిపోయి పాతాళ ♦ మునకుఁజేర్ప
కుంభకర్ణుఁడఁగాను ♦ ఘోరరౌద్రముతోడ
దురముసేయుటకును ♦ తోయజాక్ష

తే॥ గీ॥ పగతుఁడనుగాను నావంకఁ ♦ బారఁజూడు
నీదుభక్తులలో నొక ♦ బీదవాఁడను ॥భ॥ 7

సీ॥ కోదండరామ నీ ♦ కొలువు గొలుచుచునుంటి
జీతమిచ్చుటకును ♦ చేతగాద
బహునాళ్లనుండి నీ భజన సేయుచునుంటి
కద్దులేదన నింత కఠినమేల
నెరదాతవని నిన్ను ♦ నెఱనమ్మికొనియుంటి
ధర్మవాత్సల్యంబు ♦ దలఁపవేమి
బ్రతికినన్నాళ్ళు న ♦ న్మతిగాను వేళకుఁ
బొట్టపాదంబైనఁ ♦ బెట్టరాద

తే॥ గీ॥ ఓర్పుతో నింతకాలంబు నోర్చినాఁడ
నేమిసేతును నీదయ ♦ యిట్టులుండె ॥భ॥

# ప్రత్యక్ష రామచంద్ర శతకము.

సీ॥ శ్రీరామ నను బ్రోవ ♦ వేరా మొరాలించ
రాదా పరాకేల ♦ రార నాదు
నేరమా నన్నేల ♦ భారమా నీకెంత
బరువాయెనో గాని ♦ పంకజాక్ష
యేదయా నీదయ ♦ లేవాయె నాతోను
మాధవా యింక పెక్కు ♦ మాటలేల
కరుణించ నీచేతఁ ♦ గాకున్న మాతల్లి
సీతమ్మతోనైనఁ ♦ జెప్పరాద

తే॥ గీ॥ దశరథాత్మజ తమ సహో ♦ దరులకైనఁ
దెల్పి రక్షింపరాద వై ♦ దేహినాథ ॥ భ ॥

సీ॥ ఆపదబాంధవుం ♦ డనుమాట నిజమైతె
యీపట్ల ననుబ్రోచు ♦ టిదియె సాక్షి
శరణన్న భక్తులఁ ♦ గరుణించు బిరుదుకంటె
యీవేళ ననుగాచు ♦ టిదియె సాక్షి
నిజముగా వైకుంఠ ♦ నిలయుడవైన చో
నిత్తరి నన్నేలు ♦ టిదియె సాక్షి
దాశరథి క్షోభ ♦ హరదండ వీవైతె
యిప్పుడ దయఁజూచు ♦ టిదియె సాక్షి

తే॥ గీ॥ వేరె యోచనలేల శ్రీ ♦ విభుడవైతె
యిపుడు నన్ను రక్షించుట ♦ యిదియె సాక్షి ॥ భ ॥

సీ॥ రాఘవేంద్రా నన్ను ♦ రక్షింపకున్న నీ
తల్లి కౌసల్యా పా ♦ దములయాన
గౌరవంబున నన్ను ♦ గరుణించకున్న నీ
తండ్రి దశరథు పా ♦ దములయాన
కంటికి రెప్పగాఁ ♦ గాపాడకున్న చోఁ
దధ్యముగఁ దమ్ము పా ♦ దములయాన
అనవరతంబు న ♦ న్నాదరింపక యున్న
తావకానుఁగు సహా ♦ దరులయాన

తే॥ గీ॥ బ్రోవరాకున్న నంజనీ ♦ పుత్రునాన
చింతదీర్పక యుంటివా ♦ సీతయాన ॥భ॥ 8

సీ॥ ఆనబెట్టితినని ♦ యాగ్రహింపకు రామ
సర్వాపరాధిని ♦ శరణు శరణు
ఆనబెట్టితినని ♦ యాయాసపడవద్దు
సర్వాపరాధిని ♦ శరణు శరణు
ఆనబెట్టితినని ♦ యాత్మశంకింపకు
సర్వాపరాధిని ♦ శరణుశరణు
ఆనబెట్టితినని ♦ యాశ్రద్ధ జేయకు
సర్వాపరాధిని ♦ శరణుశరణు

తే. గీ॥ ఆనలన్నియుఁదీరె నీ ♦ యానఁదేరెఁ
గాన నీమదిశాంతింప ♦ గానలోల ॥భ॥

సీ॥ రామాయణంబు నే ♦ రచియించినముందుగాఁ
బ్రకటింప వల్మీక ♦ భవుఁడఁగాను
కపిసేన నొనగూర్చి ♦ కడువడి సింధుబం
ధనజేయ భానునం ♦ దనుఁడఁగాను
సీతజాడఁదెలిపి ♦ చింతదీర్చినదిని
ధృతిఁజెప్పిన పవన ♦ సుతుఁడఁగాను
దశకంఠు మర్మముల్ ♦ విశదంబుగాఁ జెప్పి
జయముగూర్చిన విభీ ♦ షణుఁడఁగాను

తే॥ గీ॥ మనుజుఁ డసమర్థుఁడను బన్ని ♦ మూలినట్టి
జనుఁడని నిరాకరించకు ♦ జలజనయన ॥భ॥ 84

సీ॥ రామ నీవే నన్ను రక్షింపవలెఁగాని
పెరవారికెటులవలెఁ ♦ బ్రేమగల్గు
శ్రీమంతులను బాగు ♦ సేయఁదలంచియు
ధరణి దార్భాగ్యులఁ ♦ జెఱుపనెంచి
యతిచిత్రముగ సస్య ♦ మడుగడు గొకరీతి
పంటనిక్షేపమై ♦ పండుచుండు
అట్టిభువికి సీత ♦ పట్టియై జన్మించి
మాతగుణములెట్లు ♦ మఱచి బోంచు

తే॥ గీ॥ నీవె రక్షించు దొరవని ♦ నిక్కముగను
నమ్మియుంటిని యిరకల ♦ నమ్మఁజాల ॥భ॥ 85

సీ॥ పద్మాక్షు తమ మృదు ♦ పర్యంకమైనట్టి
ఫణిరాజు మారుత ♦ భక్షణుండు
శంకలేక నటించు ♦ శంకర నషకయుఁ
బంట విషము లోక ♦ కంటకుండు
బోలుఁ శిరముగల్గి ♦ బుసలు కొట్టుచునుండు
మట్టినరుల బాధఁ ♦ బెట్టినట్టి
తక్షకేంద్రుఁడు భ్రాత ♦ లక్ష్మణుండై పుట్టె
నెఱుకటి గుణమేల ♦ వినుచునయ్య

తే॥ గీ॥ నన్ను రక్షింపఁగలఁడని ♦ నమ్మునయ్య
నేఁడు నను రామ సేవకా ♦ పాడవలయు ॥భ॥ 86

సీ॥ తల్లియిచ్చ నెఱింగి ♦ తగదనకను రాజ
ధర్మంబుదప్పి నీ ♦ తమ్ముఁడపుడు
అగ్రజుండనుమాట ♦ యాత్మలో సుంతైన
విశ్వాసమును లేక ♦ విపినమునకు
రఘురామ నినుబంపి ♦ రాజ్యాధికారియై
పాలించినట్టియా ♦ భరతుఁడిపుడు
మందబుద్ధులకైక ♦ మతమును మాననా
నిర్దయాత్ముఁడుగాన ♦ నిన్నెమఱచె

తే॥ గీ॥ నన్నుమన్నించఁగలఁడని ♦ నమ్మజాల
కరుణతోనను బ్రోవ నీ ♦ కన్ననెవరు ॥భ॥ 87

సీ॥ ముల్లోకనుతరామ ♦ మురారివై జన్మింపఁ
దమ పాంచజన్య సు ♦ దర్శనములు
భరతశత్రుఘ్నులై ♦ పరగజనించియు
భరతుఁడట్టులఁజేసె ♦ పాటిదప్పి
శత్రుఘ్నుఁడైనను ♦ సరసజ్ఞుఁడైతె నీ
వడవులందికుములు ♦ బహుమనుండ
మనసునం దభిమాన ♦ మానులేక మిమ్ముల
నాదరించఁడుమాత్ర ♦ భేదమునను

తే॥ గీ॥ అట్టి కపటాత్ముఁడేల న ♦ న్నాదరించుఁ
గనికరంబున నన్ బ్రోచు ♦ ఘనుఁడవీవె॥భ॥ 88

సీ॥ ఒకవేళచిత్తమిం ♦ కొకవేళనిల్వను
దివిమాలిపవమాన ♦ దేవుఁడయు
జననినేరము తన ♦ జనకునకెఱిగించు
యారసిఁబుచ్చిన ♦ యంధురాలు
అట్టి చపలులకుఁ ♦ బట్టియై యుదయించి
భానునోడిసిమ్రింగ ♦ పండటంచు
తల్లిదండ్రుల నడ ♦ తలు పట్టుబడకెట్లు
కోతిచేష్టలుమాని ♦ కూపమునడిగి

తే॥ గీ॥ హితవుతోడను ♦ హనుమంతుఁ డెటులఁబ్రోచు
నట్టులైనను నీవె చే ♦ పట్టవలెను ॥భ॥ 89

సీ॥ హా! నీవె కడు నిర్ద ♦ యాత్ముఁడవనుకొంటె
భూజాతయు గడుసు ♦ బుద్ధియయ్యె
పుడమిఁబుట్టియె బహు ♦ గడుసనుకొంటెను
సౌమిత్రి కాఠిన్య ♦ స్వాంతుఁడయ్యె
దాక్షిణ్యరహితుఁడే ♦ లక్ష్మణుఁడనుకొంటె
భరతశత్రుఘ్నులు ♦ పరుషులైరి
భరత శత్రుఘ్నులే ♦ ప్రౌఢాత్ములనుకొంటె
తుద కాంజనేయుండు ♦ దుడుకుగాన

తే॥ గీ॥ అట్టి కఠినాత్ము లెటుబ్రోతు ♦ రయ్యనన్న
నీవె రక్షింపవలెనిఁక ♦ నిశ్చయముగ ॥భ॥ 90

సీ॥ దశరథరామ నీ ♦ దర్శనంబును నాకుఁ
జూపెదవని పార ♦ జూచిచూచి
పద్మలోచన భవ ♦ త్పద్మాంఘ్రు లర్చింప
శరణంచు దోసిలి ♦ జాచిచాచి
సాధువని వినువఁ ♦ జాలక నను బ్రోవఁ
గలవని తమదండఁ ♦ గాచికాచి
వేసారి సద్భక్త ♦ వితతిని బ్రోచుట
దుస్తరంబని మదిఁ ♦ దోచితోచి

తే॥ గీ॥ పరితపింపుచునుంటి నా ♦ ప్రాప్తమనుచు
పామరుండనుగాన నీ ♦ భావమెఱుఁగ ॥భ॥ 91

సీ॥ రామహా నను వేగ ♦ రక్షింతువని భక్త
గణములతో జతఁ ♦ గలచి కలచి
ధరణిలో నాపాలి ♦ దొరవని నెఱనమ్మి
కొలువఁగ కుదిరి నిన్నుఁ ♦ గొలచి కొలచి
హా రామ కావవే ♦ యని కేక వేయుచు
భీతిచేఁ బలుమాఱుఁ బిలచి పిలచి
భవభయంబులనెల్లఁ ♦ బారదోలెడు రామ
ధ్యానంబు నాత్మలోఁ ♦ దలఁచి తలఁచి

తే॥ గీ॥ ఏమిలోఁచక నుంటి నేఁ ♦ డేమిసేయఁ
గలవొ నాతండ్రి రఘురామ ♦ కరుణఁజూడు॥ భ॥ 9

సీ॥ రామ నీసత్కృప ♦ సామాన్యముగ రాదు
తలఁచి నప్పుడె బ్రోచు ♦ దాతగావు
హరిపదధ్యానంబు ♦ మఱువకఁ దండ్రిచేఁ
బ్రహ్లాదుఁ డతి బాధ ♦ పడుచునుండ
పంచపాండవపక్ష ♦ పాతివందురె గాని
యడవి యాదిడిములు ♦ బడుచునుండ
హితుఁడు కుచేలుని సుతులిర్వదేడ్గురు
కుడువ నోగిరములే ♦ కడలుచుండ

తే॥ గీ॥ నూరకను జూచుచుంటివి ♦ కోరినపుడు
సరగుననువచ్చి రక్షింపఁ ♦ జాలనీవు ॥ భ ॥ 9

సీ॥ శ్రీవత్సలాంఛన ♦ క్షీరాంబుధిశయన
నను బ్రోవ గలవని ♦ నమ్మియుంటి
అక్షీణకరుణా క ♦ టాక్షంబు జూపవు
సృష్టిలో నా దురా ♦ దృష్టమేమొ
దీనుని పైగడు ♦ దీక్షచే సాధింపఁ
గక్షమెందుకుఁ గల్గె ♦ కామజనక
కట్టివిడుచుమనంచు ♦ భావింపబోకుమి
యెట్టులైన వదలి ♦ పెట్టనిన్ను

తే॥ గీ॥ గట్టిగా హృత్కమలమందుఁ ♦ గదలనీక
నిల్పి భజియింతు నిరతము ♦ నెమ్మనమున ॥భ॥ 94

సీ॥ శతయజ్ఞములునైన ♦ సాటి రాజాలవు
రామ నీ నామాక్ష ♦ రములతోడ
జపతపంబులునైన ♦ సాటిరాజాలవు
రామ నీ నామాక్ష ♦ రములతోడ
శాస్త్ర పురాణముల్ ♦ సాటి రాజాలవు
రామ నీ నామాక్ష ♦ రములతోడ
కోటివిద్యలునైన ♦ సాటి రాజాలవు
రామ నీ నామాక్ష ♦ రములతోడ

తే॥ గీ॥ నేవియును సాటిగావని ♦ యెంచిమదిని
రామ నీ నామము దలఁతు ♦ రాత్రిబవలు ॥భ॥

సీ॥ రామ నాజిహ్వపై ♦ రాయునడి రెండు
బీజాక్షరంబులు ♦ ప్రేమతోడ
లిఖియించి వాక్శుద్ధి ♦ ప్రకటితంబుగ నిచ్చి
సంతతానందైక ♦ స్వాంతుఁ జేసి
రామరామాయంచు ♦ నియమంబుగా సారె
సారెకున్ సొంపగు ♦ స్వరము చేత
బల్కిరచి నీనామ ♦ భజన యేమారక
చేయించుకొను మెడఁ ♦ బాయకుండి

తే॥ గీ॥ భక్తుఁడను నాకు పాపముల్ ♦ బారదోలి
పరివిమలంబైన వైకుఠ ♦ పదవినొసఁగు॥ భ॥

సీ॥ నీలమేఘశ్యామ ♦ నిజరూపమునఁగల్గ
బ్రత్యక్షమైతివి ♦ బహుపరాకు
సాధ్వీలలామయౌ ♦ జానకీదేవినీ
వామాంకమునను స ♦ త్ప్రేమనుంచ
భరత శత్రుఘ్నులు ♦ నిరుపార్శ్వముల నిల్చి
వింజామరంబులు ♦ వేయుచుండ
సౌమిత్రి వెనువెంట ♦ ఛత్రముఁ బట్టఁగాఁ
బావని భవదంఘ్రి ♦ సేవఁ జేయ

తే॥ గీ॥ భక్తులందఱుఁ గూడి నీ ♦ భజనసేయఁ
గాను నేఁటికిఁ గనులార ♦ గాంచినాఁడ॥ భ॥

సీ॥ శ్రీరామ నామంబు ♦ చెవినాలకించియు
రూఢిగా నీనిజ రూపమునను
దలఁప నన్నాళ్ళకు ♦ సెలవుగా నేటికిఁ
గనులఁబడితి వెంత ♦ కరుణగల్గె
తొల్లి నేఁజేసిన ♦ దుష్కృతంబెల్లను
తొలఁగి ధన్యుఁడనైతి ♦ తోయజాక్ష
భక్తిచేతను నిన్ను ♦ భజియించినందుకు
జన్మసార్థకమొందె ♦ సఫలముగను

తే॥ గీ॥ విదితముగ మత్సదనము ప ♦ విత్రమయ్యె
విలసితముగ మద్వంశాభి ♦ వృద్ధిపొందు ॥భ॥ 98

సీ॥ గరుడవాహన నిన్ను ♦ గాంచుట నేత్రముల్
జేసిన పుణ్యంబు ♦ సిద్ధముగను
పురుషోత్తమా నిన్ను ♦ బూజింప హస్తముల్
జేసిన పుణ్యంబు వాసిగాను
పరమపావన నీకుఁ ♦ బ్రణమిల్లుట శిరస్సు
జేసిన పుణ్యంబు ♦ భాసురముగ
వనజలోచననీకు ♦ వలగొనుటంఘ్రులు
జేసిన పుణ్యంబు శ్రీరమేశ

తే॥ గీ॥ భక్తితో రామనామంబు ♦ బ్రస్తుతింప
జిహ్వజేసిన పుణ్యంబు ♦ శ్రీనివాస ॥భ॥ 9

సీ॥ కామితార్థములిచ్చు ♦ కామధేనువుగల్గ
గోవులన్ వెలబెట్టి ♦ కొనుటయేల
పారిజాతసుమము ♦ ప్రాప్తమైలభియింప
వనపుష్పములయందు ♦ వాంఛలేల
బృందారకాభుక్త ♦ పీయూషముబ్బంగ
మధు రసంబులమీఁద ♦ మనసదేల
హతజీవ సంజీవి ♦ యౌషధముండంగ
వనమూలికల మందు ♦ తినగనేల

తే॥ గీ॥ భక్తులను గాచిరక్షించు ♦ ప్రభుఁడవుండ
నరులు రక్షింతురనిమదిన్ ♦ నమ్మనేల ॥భ॥ 100

సీ॥ వనజాక్ష మత్ప్రాప్త ♦ వశమున నేటికిఁ
జిక్కితివిఁకనాకు ♦ దక్కినావు
సాష్టాంగముగ నమ ♦ స్కారంబు జేసి నీ
పాదపద్మములపైఁ ♦ బడియు నేను
ఏకదీక్షగనమ్మి ♦ హితవుగాఁ బ్రార్థించి
రక్షించుదాఁకను ♦ రచ్చఁబెట్టి
యడుగత్తి పోనివ్వ ♦ నసమనేత్రుడువచ్చి
విడువుమనిన నేను ♦ విడువనయ్య

తే॥ గీ॥ నీకుఁ గోపమువచ్చిన ♦ నేను వెఱువఁ
గనికరంబున ననుబ్రోవు ♦ కామజనక ॥భ॥ 101

సీ॥ శ్రీజానకీప్రియ ♦ శిష్టజనవిధేయ
పాహిమాం పాహిమాం ♦ భక్తవరద
రామనామము భక్త ♦ రక్షణంబని నమ్మి
భక్తితోఁ దమ పాద ♦ పద్మములను
పొందుగా హృత్కంజ ♦ మందున నిల్పియు
శుభదినంబునచిత్త ♦ శుద్ధిగాను
ఁలసిత గొట్టుము ♦ కల్కల కోటయాఖ్యుఁడఁ
రచియించితి శతక ♦ రాజమరయ

తే॥ గీ॥ భక్తిరసపూరితంబైన ♦ భావమలర
వీనులకు విందుగా నుండు ♦ విమలచరిత॥భ॥ 106

సీ॥ ఈశతకము నిత్య ♦ మెవరైన మదిలోన
కడుభక్తిచేతఁ ద్రి ♦ కాలములను
చదివిన విన్నను ♦ చక్కగా వ్రాసిన
నాయురారోగ్యము ♦ లతిశయిల్లు
దురిత భయాపద ♦ ల్దొలగియు విజయము
చేకూరు నింటను ♦ సిరివసించు
బహుగాను వరపుత్ర ♦ పౌత్రాభివృద్ధిగా
సౌఖ్యంబు నొందుచు ♦ శాశ్వతముగ

తే॥ గీ॥ సకల సామ్రాజ్య వైభవ ♦ సౌందర్యలగుచు
శ్రీరమేశుని సన్నిధిఁ ♦ జేరగలరు॥భ॥ 107

# ప్రత్యక్ష రామచంద్ర శతకము.

సీ॥ ఓంకారభూతల ♦ వ్యోమంబు నెందాఁక
తరణి శశాంకులు ♦ తారవార
మెందాఁక దిక్కులని ♦ నెందాఁక కులగిరు
లెందాఁక వార్నిధు ♦ లిందిరేశ
యెందాఁక లోకము ♦ లెందాఁక సత్యంబు
నందాఁక సీకృతి ♦ యందముగను
సకల జనామోద ♦ సమ్మతంబై యొప్పి
ప్రకటమై వెలయును ♦ భాసురముగ

తే॥ గీ॥ యశముచేఁ బూజితంబయి ♦ దిశలు నిండు
రామనామంబు సర్వసం ♦ రక్షణంబు
భక్తవత్సలభాసుర ♦ భద్రశైల
ధామ కృపసాంద్ర ప్రత్యక్ష ♦ రామచంద్ర॥ ౧౦౧

శ్రీ ప్రత్యక్ష రామచంద్రశతకము
సంపూర్ణము.







పుస్తకములు దొరకు తావులు :-

1. శ్రీ వీరాంజనేయ సేవాసంఘ
అన్నదాన సమాజము,
కొత్తపేట - గుంటూరు.

2. వేపూరి వెంకటేశ్వర్లు,
కొత్తపేట - గుంటూరు.